ఎన్నో సంసార సంబంధాల బంధాలతో చిక్కుపడి వాసనలు అనే పరాగానికి లొంగి మోహారణ్యంలో తిరుగుతూ ఉంటుంది. బాటసారి కళ్లలో పడిన దుమ్మును వేడినీళ్లతో పోగొట్టుకున్నట్టు కర్మసంబంధమైనఅజ్ఞానం ఆత్మబోధవల్ల పోతుంది. అజ్ఞానం విడువగా మోక్షం కలుగుతుంది. చల్లనినీరు అగ్నిచే వేడెక్కినట్లు మమకారానికి చుట్టుకుపోయిన ప్రకృతిగలశరీరికష్టాలకు చిక్కుతాడు. కనుక కల్మషాన్ని పోగొట్టేది, మోక్షమార్గాన్ని చూపేది అయిన యోగాన్ని నేర్చుకోవాలి. అది మోక్షాన్ని సాధిస్తుంది. అని అనగా ఖాండిక్యుడన్నాడు –

నిమి వంశంలో నీ కన్న మిన్నగా చెప్పదగిన జ్ఞానధనుడు పుట్టడు. కనుక నీవే ఆ యోగవిద్యను నాకు బోధించాలి. ఆ విధంగా నన్ను కృతార్థుణ్ణి చెయ్యాలి. అని అనగా కేశిధ్వజుడు ప్రసన్నహృదయుడై చెప్పాడు.

రాజా! బంధమోక్షాలకు హేతువు చిత్తం. విషయసుఖాలకు అది లాగుతూ ఉంటుంది. దానిచే చిక్కులకూ చీకాకులకూ కట్టు పడవలసి వస్తుంది. ఆ వాంఛలకు లొంగకపోతే మోక్షప్రాప్తి అవుతుంది. కనుక మనస్సును చెదరనీయక బ్రహ్మధ్యానంపై అంకితం చేస్తే ముక్తి సాధ్యం అవుతుంది. ఇనుము సూదంటు రాయికి వశమైనట్లు బ్రహ్మధ్యానంచే ఆత్మభావం కలుగుతుంది. ఆత్మభావం విషయవాంఛలకు లొంగక సన్మార్గాన నడుపుతుంది. అలా స్థిరచిత్తంతో బ్రహ్మధ్యానం నిరంతరం చేస్తూ ఉండడమే యోగం. ఆ యోగవిద్యయందు నిశ్చలబుద్ధిని ప్రయోగించి వర్తించే వాడే దివ్యయోగి. మోక్షం అతనికి అరచేతిఉసిరిక. బ్రహ్మతత్త్వం తెలిసిన బ్రహ్మణ్యుడతడే – అలాగ యోగాభ్యాసంలో ఉండగా ఎప్పుడైనా ఆటంకం కలిగినా మలిజన్మలో తప్పక ముక్తి పొందుతాడు.



ఎవరినుండి ఏదీ తీసుకొనక, మిక్కిలి శుచిగా ఉండడం, అహింస, బ్రహ్మచర్యం, దొంగతనం లేకుండడం – కలవాడై యోగాభ్యాసుడు అయి, ఆ యోగఫలం కోరకూడదు.

నియమం, శౌచం, తపస్సు, వేదపఠనం, నాలుక కోరికలు విడవడం, బ్రహ్మదర్శనం (ధ్యానం) – దీనికి 'యమ' యోగం అని సంజ్ఞ. పైన చెప్పినది – కామ్య ఫలకాంక్షతో చేస్తే తప్పక సిద్ధిస్తాయి. సందేహం లేదు.

సకలాసనాలలో భద్రాసనం అలవాటు చేసుకుని దానితో యోగం అభ్యసిస్తూ పంచగుణాలనూ మనసునూ జోడించి బ్రహ్మధ్యానప్రవృత్తితో ఉండడం 'యమం' అని వచనీయం –

ప్రాణవాయువులను తన వశం చేసుకుని బ్రహ్మతత్త్వాన్ని తెలిసి ప్రవర్తించే యోగం ప్రాణాయామయోగం అని తత్త్వవిదులన్నారు.

ఊర్ధ్వముఖంగా ఉన్న ప్రాణవాయువును అధోముఖంగా ఉన్న అపానవాయువును సమానస్థాయిలో ప్రవర్తింపచేసేది లంబనయోగం.

ఆ లంబనయోగంతో శబ్దాదులకు వశీకరమైన ఇంద్రియ సమూహాన్ని తన వశం చేసుకొనడం ప్రత్యాహారం అనే యోగం అవుతుంది.

ఈ యోగాలన్నీ ఆ కేశవుణ్ణి తెలియడానికి స్థూలయోగాలు. సూక్ష్మయోగం ఏదో తెలియదు.

అని చెప్పగా ఖాండిక్యుడు సరే. ఆ హరిని ఏ విధంగా భావన చేసి యోగి ముక్తిని పొందునో ఆ విషయం చెప్పవలసిందని అడగగా కేశిధ్వజుడు చెప్పాడు.

దివ్యమూర్తియైన విష్ణువు యోగిచిత్తం నందుంటాడు. ఆ మూర్తి స్థూలరూపం, సూక్ష్మరూపం – అని రెండు విధాలు. పర + అపర సంజ్ఞగలవి ఆ మూర్తులు.

బ్రహ్మభావన, కర్మభావన, బ్రహ్మకర్మభావన అని భావన మూడు విధాలు. విష్ణుమూర్తి భేదాలను ఈ మూడు భావనలచే చూడవచ్చు. ఆ భావనలను వివరిస్తాను విను.

సనకాది మునీంద్రులు బ్రహ్మభావనాపరులు. ఇంద్రాదులు కర్మభావనా నిరతులు. బ్రహ్మాదులు బ్రహ్మకర్మభావనా రతులు.

ఈ మూడు భావనలచే నిరంతరం శ్రీహరిని ధ్యానయోగంతో ఆరాధించే పద్ధతి ధారణ అనే యోగం అవుతుంది.

జంగమస్థావరాత్మకమైన ఈ ప్రపంచం ఆ ఈశ్వరుని స్థూలరూపం. నరసుర పతుల రూపాలతో ఉండేది హరి సూక్ష్మరూపం.

స్థూల సూక్ష్మరూపాలతో ఒప్పే వాసుదేవుని పై చెప్పిన మూడు భావనలతో నిర్మల మనస్కుడై ధ్యానించేవాడే ధ్యాని అని చెప్పదగినవాడు.

విష్ణుశక్తి చరాచరజగమునందు సమంగానే ఉంటుంది. భిన్నాభిప్రాయంగల అవివేకులు వేరు రీతిగా మాటాడుతారు.

ఇప్పుడు నేను చెప్పిన యోగవిద్యతో జీవితం గడిపేవారి హృదయాలలో శ్రీహరి ఉండి వారి కిల్బిషాలను అణచి సుఖం కలిగిస్తాడు. చివర తన వద్దకు తీసుకుంటాడు.

అని సంగ్రహంగా యోగవిద్యనుగూర్చి చెప్పగా సంతోషించి ఖాండిక్యుడు రాజచంద్రా! నీ ఉపదేశంతో నా మనస్సు ప్రసన్నమయింది. పద్మాక్షునిపై నిల్చింది. అని అభినందించగా కేశిధ్వజుడు ఆనందంగా నిజపురానికి వెళ్లాడు. ఖాండిక్యుడు తన కుమారునకు పట్టంకట్టి యోగ విద్యాభ్యాసంలో సకల సుఖాలు పొంది ఆనందంగా ఉన్నాడు.



కేశిధ్వజుని తండ్రి మిథిలకు పోయి సత్కర్మలతో పద్మాక్షుని ఆరాధిస్తూ చాలా యజ్ఞాలు చేశాడు. వాసుదేవానుగ్రహంతో దివ్యభోగాలనుభవిస్తూ హాయిగా ఉన్నాడు.

అని పరాశరుడు మైత్రేయా! సర్గ ప్రతిసర్గాదుల మన్వంతరాల వృత్తాంతం చెప్పాను. ఇంక ఏమి నీ వినవలసేది! అని అనగా మైత్రేయుడు గురుదేవా! వినవలసినవన్నీ విన్నాను. మనసు నిర్మలమై శాంతగుణ భాసురమయింది. నాలో ఉన్న సందేహాలు పోవాలని మిమ్మల్ని అడగడం – మీరు శ్రమపడి చెప్పవలసేది చెప్పి వాటిని పోగొట్టడం అయింది. మీకు నా వల్ల కలిగిన శ్రమకు నన్ను క్షమించండి – అని అనగా పరాశరుడు కరుణతో చూసి నువ్వు నాకు చేసిన సేవ వల్ల దేవతలకు కూడా సిద్ధింపని శ్రీవిష్ణుపురాణం నీకు ఆనందంగా చెప్పడం అయింది. ఆలాటి పుణ్యం నాకు కలిగించావు శ్రమ కాదు.

దేవతలు, రాక్షసులు, గంధర్వులు, యక్షులు, పన్నగులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, మునులు, నాలుగు వర్ణాలవారు, నదీనదాలు, సముద్రాలు, వనాలు, పంచభూతాలు, గ్రహనక్షత్రాలు, అగ్నులూ, మన్వంతరాలు, వేదశాస్త్రపురాణాలు విష్ణుమూర్తులే. ఈ చరిత్ర విన్న వారు సకల శుభాలూ పొందుతారు. ఇన్నింటా వినుతింపదగిన విష్ణుపురాణాన్ని వ్రాసినా చదివినా చదివించినా వినినా పూజించినా శుభప్రాప్తి అవుతుంది. భక్తవత్సలుడైన ఆ పద్మాక్షుడు ఇష్టఫలాలను ప్రసాదిస్తాడు.

విష్ణుపురాణాన్ని భక్తితో చదివినా విన్నా అశ్వమేథం చేసి అవబృథ స్నానం చేస్తే వచ్చే ఫలం వస్తుంది. పుణ్యక్షేత్రాలలో స్నానం, ధ్యానం, దానం చేసిన ఫలం లభిస్తుంది.

అగ్నిహోత్రారాధన ఒక సంవత్సరం చేస్తే వచ్చే ఫలం ఒక్కమారు విష్ణుపురాణం చదివినా విన్నా వస్తుంది.

జ్యేష్ఠమాసంలో శుక్లపక్షద్వాదశి నాడు యమునలో స్నానంచేసి మధురవెళ్లి విష్ణువును ఆరాధిస్తే వచ్చే పుణ్యఫలం విష్ణుపురాణపఠనంవల్ల కలుగుతుంది. శ్రావణమాసంలో విష్ణుపురాణంనందలి కథలను కొన్నింటిని చదివినా దుస్స్వప్నదోషం పోతుంది.

సూర్యగ్రహణసమయంలో యమునలో స్నానం చేసి వైదికులైన బ్రాహ్మణులకు గోదాన భూదానాలు ఇస్తే వచ్చే ఫలం విష్ణుపురాణం వ్రాసిన వారికి వస్తుంది.

విష్ణుపురాణకథలు వినేవారికి పాపాలు పోతాయి. ఆరోగ్య భాగ్యాభివృద్ధి, కీర్తి, హరిభక్తి కలుగుతాయి.

నేను పులస్త్యమహామునివల్ల ఈ పురాణం విని నీవంటి తపోధనులకు చెప్పే ధన్యచరిత్రుడనయాను. శమీకుడు నీ వల్ల విని దీనిని కృతయుగంలో అందరికీ వినిపిస్తాడు. కనుక ఈ పురాణం కలికాల దోషాన్ని పోగొట్టి జగన్నుతం అవుతుంది. నీవు మహానుభావుడవు. నీ జననం పవిత్రం అయింది. లక్ష్మీనాథుని భక్తిని ఏమరక ప్రవర్తిస్తూ ఉండు.

అని ఈ విధంగా పరాశరమునీంద్రుడు మైత్రేయునకు వేదమూలమైన విష్ణుపురాణాన్ని పూర్తిగా వినిపించాడు.

*ఇది కవికులరత్న*
*కుమారసరస్వతీ పదలాంఛన*
**యామిజాల పద్మనాభస్వామి**
*విరచితమైన* ***శ్రీవిష్ణుపురాణం*** *సంపూర్ణం.*